# శ్రీ దత్తాత్రేయ

డాక్టర్ కంభంపాటి పార్వతీకుమార్



ధనిష్ఠ పబ్లికేషన్స్
విశాఖపట్నం

ప్రథమ ముద్రణ : 2001 - గురుపూజలు

ప్రతులు : 1000



వెల : రూ॥ 33-00

**ప్రాప్తిస్థానము** :
జగద్గురు మందిరము
(ది వరల్డ్ టీచర్ టెంపుల్)
'రాధామాధవమ్',
14-38-02, ముప్పిడి కోలనీ,
విశాఖపట్నం - 530 002.

ముద్రణ :
ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్,
విశాఖపట్నం-530 016.
ఫోన్ : 0891-747320, 751329

# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

"ధనిష్ఠ" అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువలేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంభవించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి ఇత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జనించినది.

"ధనిష్ఠ", డా॥ కంభంపాటి పార్వతీకుమార్ గారి వాక్కును, సిడి, ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపములోను భద్రపరచి సత్సాధకుల కందునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

"ధనిష్ఠ" ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును, సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

# తొలిపలుకు

దత్తాత్రేయుడు మూర్తీభవించిన గురుతత్త్వము. లోకములను సృష్టించి, లోకధర్మముల నేర్పరచి, శాశ్వతానందము ననుభవించుటకై దైవము జీవులను లోకమునందు ప్రవేశపెట్టినాడు. శాశ్వతానందము ననుభవించవలెనన్న జీవులకు తమ నిజస్థితి తెలియవలెను. ధర్మము తెలియవలెను. నిజస్థితి తెలిసి, ధర్మానుష్ఠానమున దైవముచే సంకల్పింపబడిన శాశ్వతానందమును పొందవలెను.

శాశ్వతానందము పొందవలెనన్నచో జీవులకు తమ నిజస్థితి తెలియజెప్పుటకు, ధర్మమును వివరించి తెలియపరచుటకు, చూపుటకు ఒక ఉపాధ్యాయుని ఆవశ్యకత ఏర్పడినది. దైవమే అట్టి ఉపాధ్యాయునిగ, ఆచార్యునిగ దిగివచ్చి జీవులకు ధర్మానుష్ఠాన బుద్ధి, నిజతత్త్వ విచారణ నేర్పుచున్నాడు.

ఇట్టి ఆచార్యులు మూడు లోకములలోను గలరు. ఆచార్యతత్త్వమే శ్రీ దత్తాత్రేయుడు. సృష్టి యందలి ఏ గురువైననూ ఈతని అంశయే. శ్రీ దత్తాత్రేయుడు మూలగురువు. ఈతని గూర్చి కొన్ని భావములు ఈ పుస్తకమున ఆవిష్కరింపబడినవి. సత్సాధకులకివి తప్పక స్ఫూర్తిని కలిగించగలవు.

- కె. పార్వతీకుమార్

## సంకలనకర్త : డాక్టర్ కంభంపాటి పార్వతీకుమార్

మాతృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా, మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గాను యాయులకు వెలుగుదారి చూపించుచున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి డాక్టర్ కంభంపాటి పార్వతీకుమార్‌గారు. వారి బోధనలు లెక్కకు మించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగనే కాక నిత్యజీవితమందు అనుసరణీయమై, ఆచరణయోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ "డాక్టర్ ఆఫ్ లెటర్స్" పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది. ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో - మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే, దానికి సాఫల్యత, సార్థకత వుండునని, "మానవసేవయే మాధవసేవ" అన్న మాటకు

సరియైన అర్థం యిదేనని శ్రీ కుమార్‌గారు ప్రవర్తన ద్వారా తెలియపరచు చున్నారు.

శ్రీ పార్వతీకుమార్ బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానము వికసింపజేయు గురువు, శారీరక - మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, అనేక గ్రంథముల సంకలనకర్త, నిగర్వి, నిర్మల హృదయులు. జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాలరనియూ, సంకలన కర్తలేననియు శ్రీ కుమార్‌గారి దృఢవిశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికీ సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# శ్రీ దత్తాత్రేయ

## ఆత్రేయుడు

ఆత్రేయుడు అనగ, అత్రి మహర్షి కుమారుడు. అత్రి మహర్షి కుమారునిగ లోకమున అవతరించినవాడు దత్తాత్రేయుడు.

దత్తాత్రేయుడు అనగ, ఆత్రేయునిగ లోకమునకు దత్తము చేయబడిన వాడు అని అర్థము. దత్తము చేయబడుట అనగా, అందింపబడుట.

## అత్రి

అత్రి, అనసూయల కుమారుడు దత్తాత్రేయుడు. ఇది శాశ్వతసత్యము మరియు ధర్మము. అత్రి అనగా మూడు కానిది. అనగా, త్రిగుణములు కానిది, తదతీతమైనది అని అర్థము. త్రిగుణాతీతము కాని శుద్ధ చైతన్యమును అత్రియని పిలుతురు. అది లోకాతీతము అయిన చైతన్యస్థితి. ఈ స్థితిని చేరిన వారి నందరినీ అత్రి యని పిలువ వచ్చును. గుణాతీతము అయిన తత్త్వము, గుణముల త్రిభుజము నుండి వ్యక్తమై లోకములు ఏర్పడుచుండును. సృష్టి యంతయు త్రిగుణముల అల్లికయే. ఎరుపు, నీలము, పసుపు దారములతో అల్లబడిన వస్త్రము వలె, లోకము లేర్పడుచున్నవి. ఈ దారములోని పత్తి వలె, త్రిగుణాత్మక లోకసారముగ శుద్ధచైతన్య ముండును. ఆ చైతన్యము త్రిగుణముల లోపల, బయట కూడ నిండి యుండును. త్రిగుణాతీతమైన

చైతన్యము త్రిగుణముల నుండి వ్యక్తమగుటయే, ఆత్రేయుడు వ్యక్తమగుట, లేక దత్తమగుట లేక అందింపబడుట.



త్రిగుణాతీత చైతన్యము

## అనసూయ

త్రిగుణములు సమన్వయింపబడి సమకోణ త్రిభుజముగ నుండుట అనసూయత్వము అందురు. లోకమున అసూయ సహజము. దానికి కారణము, త్రిగుణముల కలయికలోని హెచ్చు తగ్గులు. మూడు గుణములు సమన్వయింపబడిన వానియందు అసూయ మొదలగు అరిషడ్వర్గము లుండవు. అది యోగస్థితి. జీవుని సహజానంద స్థితి. కాని, కోరిక (రజస్సు) కారణముగ ఎప్పటికప్పుడు జీవుడు ఈ స్థితినుండి పతనము చెందు చుండును. ఒకసారి త్రిగుణముల సామ్యము చెదరినచో మరల సామ్య మేర్పడుటకు కాలము పట్టును. నిర్మలమైన తటాకమున ఒక బెడ్డ వేసినపుడు ఏర్పడు తరంగము లనంతములు. మరల నిర్మల, నిశ్చల తటాక మేర్పడుటకు సమయము పట్టును గదా! త్రిగుణముల సామ్యము చెడినవారు అసూయ కలిగియుందురు. అనగ, అసూయాది గుణములు కలవారు, త్రిగుణముల సామ్యము చెడినవారని అర్థము. చెడనివారు అనసూయులు. శ్రీ దత్తుడు అనసూయత నుండి వ్యక్తమైన వాడు, అనగా శుద్ధ చైతన్యమే యథావిధిగ అవకరణములు లేక, అవ్యక్తస్థితి నుండి వ్యక్తస్థితికి అవతరించిన సన్నివేశము శ్రీ దత్త అవతారము !

శ్రీ దత్తుడు పై కారణముగ, లోకమున సంచరించుచున్న దివ్యత్వము అని తెలియబడుచున్నది. అత్రి (మూడు గుణములకు అతీతమైనది) అనసూయ (అసూయలేని స్థితి) ల కుమారుడు శ్రీ దత్తుడని తెలుపుట యందిట్టి రహస్యము, శాశ్వతము అయిన ధర్మము లిమిడి యున్నవి. తెలియవలెను.

## సమకోణ త్రిభుజము




సామ్యముతో గూడిన త్రిగుణముల నుండి దిగివచ్చిన వాడగుటచే శ్రీదత్తునకు మూడు గుణములపై ఆధిపత్య ముండును. త్రిగుణములకు అతీతుడై యుండియు, త్రిగుణముల నుండి వ్యక్త మందినవాడు. అనగా తనను తాను సృజించుకొన్నవాడు. సత్వ, రజస్తమస్సులు మూడు శిరములుగ యిందులకై సంకేతింప బడినవి. శ్రీదత్తుడు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులకు కూడ యిందువలన అధిదేవత. ఇతని మూడు శిరములు మూడు దివ్యగుణములకు, త్రిమూర్తులకు, త్రిశక్తులకు సంకేతము.

(ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు; సత్వ, రజస్తమో గుణములు ఎవరియందు సమన్వయింపబడునో, వారు అనసూయత్వము పొందగలరు. అనసూయత్వమునకు శ్రద్ధ పునాది. శ్రద్ధ లేనివారికి విద్య (జ్ఞానము) లేదు. జ్ఞానము లేనివారికి అనసూయత్వము రాదు. శ్రద్ధ తన కర్తవ్యముకు సంబంధించినది. శ్రద్ధ తగ్గినవారు తమ కర్తవ్యమును మరచి, యితరులపై అభిప్రాయము

లేర్పరచుకొనుచు, మంచి-చెడ్డలు నిర్ణయించుచు కాలము వృథా చేయుదురు.

సమకోణ త్రిభుజము మాత్రమే సృష్టి బంధమునుండి విముక్తి కలిగించ గలదు. అందుచే సమకోణ త్రిభుజము, కేంద్రబిందువు ఒక ప్రధాన యంత్రముగ ప్రాచీన ఋషులు దర్శించినారు. సమకోణ త్రిభుజ విజ్ఞానమునే 'త్రయీవిద్య' యని అందురు. ప్రాచీన భారత దేశమునందు త్రయీవిద్య చాల ప్రాముఖ్యము వహించినది. ఈ విద్యనే పైథాగరస్ అను గ్రీకు ఋషి 'హోలీ త్రినోసోఫియా' అని పలికెను. త్రినో అనగ త్రయము. సోఫియా అనగ విద్య. కావున భారతీయ త్రయీవిద్యయే పవిత్ర త్రయీవిద్య- హోలీ త్రినో సోఫియా అని పిలువబడుచున్నది.

పైథాగరస్ క్రీస్తు పూర్వము మూడు వందల సంవత్సరముల కాలములో గ్రీకు దేశములో ఆధ్యాత్మిక తత్వమును, విశ్వ విజ్ఞాన విద్యను అందించిన ఋషి. ఇతడు ప్రాథమిక దశలో భారత దేశమునకు వచ్చి తక్షశిల, పాటలీపుత్రము, వారణాశి యిత్యాది పీఠములలో విద్య నభ్యసించెనని, అతని విద్యా సముపార్జనముకు దృప్తిచెంది భారతీయ పీఠాధిపతులు అతనికి 'పీఠగురు'వని బిరుదిచ్చిరని, కాలాంతరమున ఈ బిరుదు పీఠాగురు, పిథాగురు అయినదని కొందరి భావము. గ్రీకులో పిథాగురు అందురు. ఆంగ్లమున పైథాగరస్ అయినది. క్రీస్తు పూర్వము గ్రీకు నాగరికత చాలా వైభవోపేతముగ నుండెడిది. భారతదేశముతో చక్కని సంబంధములు విద్యా-సాంస్కృతిక పరముగ నుండెడివి. అందుచే

త్రయీవిద్య, యితర భారతీయ సాంప్రదాయములు ప్రాచీన గ్రీకు దేశమున నుండెడివి.)

## దశాంగుళము

త్రిగుణాత్మక సృష్టి ఏడు లోకములతో కూడినది. మూడు గుణములు, ఏడు లోకములు కలిపి దశాంగుళము అను సంకేతము ఏర్పడును.




త్రికోణమున చివరగల మూడు బిందువులు త్రిమూర్తులు కాగా, వాని నడుమగల ఏడు బిందువులు ఏడు లోక ప్రజ్ఞలకు చిహ్నము. పరమ పురుషుడు దశాంగుళముగ సృష్టి నేర్పరచి దానిని అధిష్ఠించి యున్నాడని పురుష సూక్తమను ఋగ్వేద సూక్తము తెలుపుచున్నది.

*సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్*
*సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాంగుళమ్.*

పై తెలుపబడిన దశాంగుళమును సంకేతముగ శ్రీ దత్తుని ధ్యానించుట ప్రాచీన ఆచారము.

శ్రీ దత్తుడు త్రిమూర్తుల సమాగమ ప్రజ్ఞ యగుటచే, త్రిమూర్తులు సృష్టికి అధిష్ఠాన దేవతలగుటచే, అందరికంటే శ్రీ

దత్తుడు పెద్దవాడు. అందరికన్న పెద్దను గురువందురు. అందుచే శ్రీ దత్తుడు, శ్రీగురుడు అని కీర్తింపబడుచున్నాడు. అతడే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపములందు వ్యాపించిన పరతత్త్వము అగుటచే, అనాదిగా ఈ క్రింది శ్లోకముచే స్తుతింపబడు చున్నాడు.

*గురుబ్రహ్మ గురుర్విష్ణుః - గురుదేవో మహేశ్వరః ।*
*గురుసాక్షాత్ పరబ్రహ్మ - తస్మై శ్రీ గురవే నమః ॥*

## శ్రీ గురుదత్తుడు - సద్గురువులు

సృష్టి యందలి సమస్త సద్గురు స్వరూపములు శ్రీ దత్తునివే! ఎవరు ఏ సద్గురువు నుద్దేశించి పై స్తోత్రము చేసినను, అది శ్రీ గురుదత్తునకు చేరును. గురువొక్కడే. గురుతత్త్వము ఒక్కటియే. అది ఏ రూపమున వ్యక్తమైననూ అతడు దత్తుడే. గురువనగ గుర్తు తెలుపువాడు. అనగ, మన నిజస్థితిని తెలుపువాడు. మనము ఆత్మ స్వరూపులము. చైతన్య స్వరూపులము. నశింపని వారము. మనకు జనన మరణములు లేవు. ఈ నిజమును తెలుపుటకు గురు వవతరించును. ఉద్ధరించును. పరమున దక్షిణామూర్తి తత్త్వముగను, ఇహమున దత్తాత్రేయుడుగను యున్నది ఒక్కడే జగద్గురువు. మహర్షులు, సిద్ధులు, సాధ్యులు, అఖిల దేవతలు, లోకపాలకులు, లోకస్థులు ప్రార్థింపగ మూలతత్త్వమగు శ్రీ దక్షిణామూర్తియే దత్తము గావింపబడి శ్రీదత్తుడైనాడు. పరమున నున్నవానిని పరమశివుడని, నారాయణుడని, పరబ్రహ్మమని, పరాశక్తియని వివిధ సాంప్రదాయములవారు పిలుతురు. ఆ తత్త్వము ఒకటియే. అది అనిర్వచనీయము. తర్కమునకు అతీతము. ప్రజ్ఞకు మూలము కావున ప్రజ్ఞకు కూడా అందనిది. త్రిగుణములకు

ఆధారమైన వెలుగు. చీకట్లకు కూడ మూలము. వేదములలో దానిని తత్ అనిరి. అది యని పిలుచుటలో లింగ భేదము చెందక, స్త్రీ పురుష సమాగమ ప్రజ్ఞగ తెలుపబడినది. పరతత్వము స్త్రీ మాత్రమే కాదు. అటులనే పురుషుడు మాత్రమే కాదు. రెండునూ కలసిన స్థితి. రెంటికిని పుట్టుక స్థితి. ఆ తత్త్వము సృష్టికి మూలము. అది సృష్టి వ్యాపనము చెందినపుడు పురుష ప్రజ్ఞగను, స్త్రీ (ప్రకృతి) ప్రజ్ఞగను, కాలముగను, శక్తిగను, త్రిగుణములుగను వ్యక్తమై, లోకములను, లోకేశులను, లోకస్థులను ఏర్పరచును. అది చరాచర సృష్టి యందలి జీవులకు ప్రేరణయిచ్చి తమతమ మూలములకు గొనిపోవుటకు యోగవిద్య అవశ్యమయ్యెను. అట్టి యోగవిద్య నందించుటకు, మరల ఆ తత్త్వమే పరిపూర్ణముగ సృష్టియందు వ్యక్తమగుట శ్రీ దత్తుని అవతారమని తెలియవలెను. అందుచే శ్రీ దత్తుడు సృష్టి సమస్తము వ్యాపించిన పూర్ణప్రజ్ఞ. తదతీతము గూడ. ఇహపర సుఖముల నందించుట కతడు సృష్టియందలి గురువుగ నేర్పడినాడు. సనాతనుడు. అతడే కపిలుడుగ సాంఖ్యము నందించినాడు. (భక్తి జ్ఞాన, వైరాగ్య యోగ సమాగమమే సాంఖ్యము).

శ్రీ గురుదత్తుడు యోగమునకు అధిదేవత. 'దత్తస్స్యయోగః అధయోగనాథః అను వాక్యమున యీ సత్యము ప్రతిపాదింప బడినది. యోగవిద్య అనాదిగ, మానవునకు అమృతత్వమును, బ్రహ్మత్వమును అందించు విద్య. అది గురుముఖముననే లభించును. శ్రీ దత్తుడే గురుముఖముగ ఈ విద్య నందించును. జీవుల నుద్ధరించుటకు జీవులలో తా నొకడుగ నుండును. రహస్యముగ నుండును. అర్హత ననుసరించి ఉపదేశము చేయును.

# నాలుగు జాగిలములు

శ్రీ గురుదత్తుని అనుసరించుచు నాలుగు జాగిలములు (కుక్కలు) గోచరించును. ఈ నాలుగు జాగిలములు, నాలుగు వేదములు, నాలుగు కాలములు (యుగములు). వేదములు వాఙ్మయములు. వాక్కు - పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అను నాలుగు స్థితులలో నుండును. సృష్టి సమస్తమునకు వాక్కు మూలము. దాని యుచ్చారణమే సృష్టి. నాదముగ ఉద్భవించి, ఓంకారమై, సప్త మాతృకలై, అటుపై ప్రాణ శక్తులుగ (అచ్చులుగ), దేహధారులుగ (హల్లులుగ) ఏర్పడి, పదములు, వాక్యములు, గ్రంథములు అయినట్లు, వాక్కే సమస్త సృష్టికి మూలము. ఈ వాక్కునే ఋగ్వేదమున సరస్వతిగ కీర్తించిరి. సరస్వతి యనగ ప్రవాహము. అది చైతన్య ప్రవాహము. సత్యము నుండి ఉద్భవించిన శుద్ధచైతన్యము. త్రిగుణాత్మకమై సృష్టి జరుగుచున్నది. శబ్దములు నాదమునుండి ఉద్భవించుచున్నవి. నాదము అనాహతము. మన మెరిగిన శబ్దములు ఆహతములు. ఆహత శబ్ద మనగ రెండు వస్తువుల తాకిడి, లేక రాపిడి వలన ఏర్పడు శబ్దము. అనాహత మనగా ఆహతము కానిది. అనగా తాకిడి, రాపిడి లేక వుండు శబ్దము. దీనిని హృదయమున వినవచ్చును. అందుకే హృదయ కేంద్రమును అనాహత కేంద్రము అని పిలుతురు. గొంతుచే ఉచ్చరింపక వినపడు అంతర్ముఖ నాదమది. అదియే ఓంకారము. అది సృష్టి యందు శాశ్వతముగ నుండును. ఓంకారము ఆగినచో సృష్టి అంతమగును. - కరెంటు పోయినచో పంఖా ఆగినట్లు - ఓంకార మాగినచో సృష్టి అదృశ్యమగును. నాదము సృష్టికి అదృశ్యమగు విద్యుత్ వంటిది.

పై తెలిపిన నాదము స్థితులలో నుండుట వైదిక దర్శనము. అవియే పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి. ఈ నాలుగు స్థితులనే వైష్ణవ సాంప్రదాయమున నారాయణ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న వ్యూహములుగ తెలుపుదురు. శైవులు ఈ నాలుగు స్థితులను పరమశివుడు, సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు అని తెలుపుదురు. శాక్తేయులు ఈ నాలుగు స్థితులను పరాశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులుగ తెలిపిరి. స్మార్తులు పై నాలుగు స్థితులనే సత్యము, చైతన్యము, భావము, చేత అని తెలిపిరి. భారతీయ వాఙ్మయమున ఈ నాలుగు స్థితులు పదే పదే ఆస్తికులకు వివరింప బడుచుండును. ఈ క్రింది శ్లోకములు లోక విదితములు :

1. *చత్వారి వాక్పరిమితా పదాని* - సరస్వతీసూక్తము
2. *చతుర్వర్గ ఫలం జ్ఞానం* - మహాభారతమ్
3. *చాతుర్వర్ణ్యం మయా సృష్టం* - భగవద్గీత
4. *చతురాత్మా, చతుర్వ్యూహ* - విష్ణు సహస్రనామము
5. *చతుర్మూర్తి, చతుర్ బాహుః* - విష్ణు సహస్రనామము

వాక్కు యొక్క నాలుగు స్థితులే నాలుగు వేదములు, మనయందు ఈ నాలుగు వేదములు నిర్వర్తింపబడు చున్నవి. మనయందు సంకల్ప మేర్పడుట, అది భావముగ మారుట, భాషణము చేయుట - ఋగ్వేదము. ప్రాణ స్పందనము, గుండె కొట్టుకొనుట, శ్వాస, ఉపిరితిత్తులు పనిచేయుట, రక్తప్రసారము - సామవేదము. జ్ఞానముతో కూడి నిష్కామ కర్మ చేయుట - యజుర్వేదము. తత్ఫలితముగ బాహ్యమున ఫలితము లేర్పడుట అధర్వణ వేదము. ఇట్లు ప్రతి నిత్యము నాలుగు వేదములు

మనయందు నిర్వర్తింపబడుచునే యున్నవి. ఈ నాలుగు వేదములు శ్రీ దత్తుని అధీనమున యున్నవని తెలియజెప్పుటకే నాలుగు జాగిలములు అతనిని అనుసరించి మెదలు చున్నట్లుగ సంకేతింపబడెను.

జాగిలములకు, వేదములకు సంబంధమేమి యను ప్రశ్న పాఠకునకు జనింప వచ్చును. వినుటయను ప్రజ్ఞ జాగిలమునకు ఎక్కువ. మనము విననివి, వినలేనివి కూడా జాగిలములు వినగలవను సత్యము విదితమే కదా! మనము సామాన్యముగ వినలేని శబ్దము అనాహత శబ్దము. వినలేని శబ్దమును వినుట యనగ అనాహత శబ్ద గ్రహణము లేక సూక్ష్మ శబ్ద గ్రహణము అని తెలియవలెను. దీనినే ఆకాశవాణి లేక దివ్యవాణి యందురు. మాట్లాడుట కన్న, వినుట మిన్న! వినుటలో నిశ్శబ్దమును వినుట మరింత శ్రేష్ఠము. మహాత్ములు ఎక్కువగా నిశ్శబ్దమునే వినుచుందురు. అదియే అసలు శబ్దము, నాదము. మన మెరిగిన శబ్దము అసలు శబ్దమునకు అంతరాయము. అసలు శబ్దమును లేక నిశ్శబ్దమును వినగలిగినవారు అప్రమత్తులు. జాగిలము అట్టి అప్రమత్తతకు చిహ్నము. శ్రవణము ఒక ప్రత్యేకమైన విద్య. దాని అభ్యాసము యోగమున ముఖ్యము. వినగలిగిన వారికి దైవము యొక్క సందేశము లందగలవు.

మన సూర్యమండలమునకు దక్షిణముగ అంతరిక్షమున శారమేయ మండలము కలదు. శరమయనగ కుక్క. ఆ మండలము కుక్క ఆకారమున నుండుటచే, మన ఋషులు దానిని శరమ మండలము లేక శారమేయ మండలము అనిరి. పాశ్చాత్యులు దీనిని 'సిరియస్ సిస్టమ్' అని పిలుతురు. ఈ మండలమందు

కేంద్రముగ నున్న నక్షత్రమును 'డాగ్ స్టార్' అందురు. శరమ శబ్దము నుండే శర్మ అను శబ్దము పుట్టినది. విని, పలుకువాడు శర్మ. యజ్ఞములు నిర్వర్తించు నిపుణుడు, దివ్యమును విని పలుకువాడై యుండవలెను. అట్టి వారినే శర్మ యని పిలువవలెను. శరమ మండలమునకు అధిపతి కూడా దత్తాత్రేయుడే. దక్షిణమున యుండుటచే దాక్షిణ్యమూర్తి యని తెలియవలెను. శరమ మండలాధిపతి యగుటచే, అనాహత శబ్దము వినగలిగిన వారికే శ్రీ దత్తుని దర్శన, స్పర్శన, సంభాషణాది భాగ్యము కలుగునని తెలియవలెను. మొత్తము శారమేయ మండలము లేక నాదము, శబ్దముల జ్ఞానమునకు శ్రీ దత్తుడే గురువని తెలియవలెను.

మన సూర్యమండలము పరిణామమున పురోగతి చెందుటకు తండ్రి వలె సప్తర్షి మండలము పనిచేయు చున్నది. తల్లివలె కృత్తికా మండలము పనిచేయు చున్నది. గురువు వలె శారమేయ మండలము పనిచేయు చున్నది. సప్త ఋషులు, సప్త మాతృకలు తలిదండ్రులుకాగా, శ్రీ దత్తుడు గురువై సమస్త పరిణామ కార్యక్రమమును నిర్వర్తించు చున్నాడు. ఇది జ్యోతిష విద్యయందు ఈ వివరింపబడిన సత్యము. వివరములకు 'ఈటటిరిక్ ఎస్ట్రాలజీ' అని పరమగురువు జ్వాలాకూలునిచే వివరింపబడిన గ్రంథము చూడుడు.

మన భూమిపై శారమేయ మండలమునకు ప్రతినిధిగ హిమాలయములందు పరమగురువుల ఆశ్రమము కలదు మరియు నీలగిరులలో కూడా అట్టి ఆశ్రమము కలదు. మన భూమికి గురుత్వము వహించిన నారాయణాంశ జగద్గురువు మైత్రేయులు

(వివరములకు గ్రంథకర్తచే రచింపబడిన 'ది వరల్డ్ టీచర్' అను గ్రంథమును పరిశీలింపుడు.) మైత్రేయుడు, దత్తాత్రేయుడు మాత్రమే ప్రస్తుతమున తాదాత్మ్య స్థితి నందించు జగద్గురువులై విలసిల్లి యున్నారు. (వివరములకు మాస్టర్ ఇ.కె. విరచిత 'స్పిరిచ్యువల్ ఎస్ట్రాలజీ' చూడుడు.) వీరి ఆధ్వర్యమున సమస్త గురు జనము, జీవులకు యోగమును, తద్వారా అమృతత్వమును సంతర్పణ చేయుచున్నారు.

కావున, శ్రీ దత్తుని చుట్టునూ గల నాలుగు శరమములు మహత్తర సత్యము చాటు నాలుగు వేదములుగను, నాలుగు కాలములుగను, నాలుగు స్థితులుగను, నాలుగు వర్ణములుగను, నాలుగు జ్ఞానావస్థలుగను తెలియవలెను. అవి శబ్ద మయములని, నాదమయములని కూడా తెలియవలెను. ఈ సమస్తమును మనయందు దర్శించ వలెనని కూడా తెలియవలెను. అట్టి దర్శనమునకు శ్రీ దత్తుడు మార్గదర్శియని, గురువని తెలియవలెను.

సద్గురు శ్రీ సాయినాథుని దగ్గర కుక్కలు చేరుటలో పై రహస్యమును పాఠకులు గమనించగలరు. వారు శ్రీ దత్తావతారులని సంకేతింపబడుచున్నది.

## గోవు

శ్రీ దత్తునితోపాటు పుష్టికరమైన గోవు యుండును. ఆ గోవును శ్రీ దత్తుడు కాపాడుచుండును. గోవు, వేదమున - సృష్టికి సంకేతింపబడినది. భూమిని కూడా సంకేతించును. భూమి లేక సృష్టి, జీవులకు సర్వ సంపదలు, సర్వ సౌభాగ్యములు, అనుభూతులు, విభూతులు, తదానందము అందించగలవు. గోవు

క్షీరము నందించి జీవులను వృద్ధిపరచి, తృప్తిపరచు రీతిగ భూమి, సృష్టి జీవుని ఆనందమునకే ఏర్పరుపబడినవి. గోవును పోషించి, రక్షించి, పూజించి, క్షీరమును గొనుట సంస్కారము. గోవును దూషించి, హింసించి, క్షీరమును, మాంసమును గొనుట పైశాచిక ప్రవృత్తి. దైవమే దానిని పోషించు చుండగ, రక్షించు చుండగ, మానవులు నిర్లక్ష్యము చేయుట తగదు. సృష్టి, భూమి, గోవు కామధేనువు వంటివి. సత్ప్రవర్తనముతో వానినుండి సమస్త ఐశ్వర్యములను పొందవచ్చును. దుష్ప్రవర్తనము వలన పతనము తప్పదు. వసిష్ఠ - విశ్వామిత్రుల ఉపాఖ్యానము యీ విషయమును చక్కగ వివరించును (శ్రీమద్రామాయణము - బాలకాండ).

గోవు, స్త్రీ, భూమి, సూర్యమండలము, సృష్టి చక్రము- ఇవి అన్నియు కామధేనువులే. పూజించి, పోషించి, ఉన్ముఖము చేసుకొనినచో సమస్త సుఖముల నందించ గలవు. వీనిని పరిరక్షించువాడు శ్రీ దత్తుడు. శ్రీకృష్ణుడు, శ్రీదత్తుడు మాత్రమే గోసమేతులుగ తెలుపుట గమనార్హము. శ్రీ దత్తుని వలెనే శ్రీకృష్ణుడు గూడ త్రైలోక్య గురువు. మూడు లోకములకూ గురువు. శ్రీకృష్ణుడు కూడా త్రిమూర్త్యాత్మకుడే. బ్రహ్మ వలె సృష్టిని చేసి బ్రహ్మచే పూజింపబడెను. శ్రీ మహావిష్ణువు వలె ధర్మ సంస్థాపనము చేసెను. శ్రీహరుని వలె దుష్టులను హరించెను. శ్రీ గురుని వలె యోగవిద్య, బ్రహ్మవిద్య, ఉపనిషత్సారమును భగవద్గీతగ నందించెను. వీరిద్దరికిని చాలా సామ్యము కలదు. అందువలననే అన్నమాచార్యులవారు *"తనరగ కపిలుడై, దత్తాత్రేయుడై, ఘనమైన మహిమ శ్రీవెంకట రాయుడై..."* అనుచు శ్రీకృష్ణుని, సానబట్టిన భోగిగను, జ్ఞానయోగిగను, సంసార యోగిగను

కీర్తించెను. శ్రీకృష్ణుడు, శ్రీదత్తుడు పరిరక్షించు కామధేనువు సృష్టియందు అత్యద్భుతమగు కార్యములను నిర్వర్తించును. మన శరీరమందలి గ్రంథులు, అందుండి స్రవించు రసములు ధేనువులే. సంగీతము రస స్వరూప మగుటచే, దానిని నిర్వర్తించు గంధర్వులు గూడ ధేనువులే. ప్రాణమును, ప్రజ్ఞను వ్యాప్తిచేయు సూర్యకిరణములు కూడా ధేనువులే, లేక గోవులే. ఆహారము, పానీయములను పిండి, రక్తధాతువులుగా మార్చుట, రక్త ధాతువులనుండి క్షీరధాతువుల నేర్పరుచుట, వాటిని శిశువులకు జీవసారమగు ఆహారముగ నందించుట గూడ ధేనుత్వమే. వైఖరీ వాగ్ధ్వనిని గాంధర్వ విద్యగ లయబద్ధము చేసి, విశుద్ధి నుండి శక్తిమయమగు చైతన్యము నుద్భవింప జేయుట గూడా ధేనుత్వమే. ఇట్టి సమస్త రసాయన కార్యములకు ధేనువు (గోవు) సంకేతము. దానిని పరిరక్షించువాడు శ్రీ దత్తుడు.

యోగవిద్య, శరీరమందలి గ్రంథులనుండి పవిత్రములైన రసములను స్రవింపజేసి, దివ్య శరీర నిర్మాణము గావించుటకు, తద్వారా జీవుడు మరణము దాటుటకు అందింపబడిన విద్య. యోగులు దివ్య శరీరధారులై శాశ్వతముగ సృష్టి యజ్ఞమునకు తోడ్పడు చుందురు. సనక సనందనాదులు, నారదుడు, శుకుడు, వ్యాసుడు, ధ్రువుడు, మైత్రేయుడు అట్టివారే. హనుమంతుడు వజ్ర శరీరము గలవాడు. వజ్రాంగుడు అని ప్రసిద్ధి గాంచినవాడు. అతడు యోగీశ్వరుడు. యోగులకన్న యోగీశ్వరులు మిన్న అయినవారు. యోగీశ్వరులకన్న యోగేశ్వరులు మిన్న. శ్రీదత్తుడు, శ్రీకృష్ణుడు యోగ్వేశరులని కీర్తింప బడుచున్నారు. వారు యోగవిద్యయను కామధేనువును పరిరక్షించువారు కదా!

# త్రైలోక్య గురువు

శ్రీగురుడు అన్ని వర్గముల వారికిని గురువే. దేవతలకు, మానవులకు, దానవులకు కూడా అతడు గురువే. గురువునకు జీవుని మంచి చెడ్డలతో ఎక్కువ సంబంధము లేదు. తలిదండ్రుల వలె అందరి యందును ప్రేమానురాగములు కలిగి యుండును. అందరికిని ఉద్ధారణము అనువగు మార్గము నిచ్చును. మంచి తనముతో జీవుల సంస్కారములు సరిదిద్దును. దేవాలయమునకు అన్ని రకముల వారును వెళ్ళవచ్చును. కొందరికి ద్వారములు మూయబడవు. అటులనే గురుడును. ఎవని కేమి కావలయునో అది గురువును కోరుట సహజము. కోరినదికాక, వలసినది అనుగ్రహించుట గురువు చేయును.

శ్రీగురుని దేవలోకమున త్రిశిరు డందురు. కారణమేమన, అతడు దేవతలను, మానవులను, దానవులను కూడ ఉద్ధరించును. మూడు వర్గముల వారిని, మూడు లోకముల వారిని అనుగ్రహించును. దేవలోకమున శ్రీ దత్తుడు త్రిశిరుడు. (మూడు తలలు గలవాడు) ఈ ఇంద్రునకు కూడా గురుత్వము వహించి జయమును కలుగజేసినాడు. ఇంద్రుడు శ్రీగురువు వలన విజయము నందితినని, వినయముతో గురుదర్శనమునకు సమస్త విధములైన అమూల్యకానుకలతో పోవ, అచట ఇంద్రుడు చిత్రాతి చిత్రములైన విషయమును దర్శించును. తన గురువు దేవతలకు ఒక ముఖముతోను, దానవులకు ఒక ముఖముతోను, మానవులకు మరియొక ముఖముతోను సంభాషణము చేయుచూ, సలహాల నిచ్చు చుండెను. ఇంద్రుడు అహంకరించి, అతనిని సంహరింప

బూనును. ఇది పరిపూర్ణమైన అజ్ఞానము. ఇది కారణముగ ఇంద్రుడు పతనము చెందును. (శ్రీమద్భాగవతము - వృత్రునికథ) శ్రీ గురుడు అన్ని లోకములను బ్రోచును. బ్రోచుటకు జ్ఞానమును సంతర్పణ చేయును. దేవలోకమున త్రిశిరుడుగ వున్నట్లే పాతాళమున కపిలుడుగ వుండును. మానవలోకమున ఉన్మత్త వేషధారియై యుండును. అతడు బహురూపుడు. అందుచే అతనికి శతరూపుడు అను నామము కూడ ఏర్పడెను.

## హస్తములు - శంఖము

శ్రీ దత్తుడు త్రిమూర్త్యాత్మకు డగుటచే అతనికి ఆరు హస్తము లుండును. శంఖము, చక్రము, గద, శూలము, కమండలము, బిక్షాపాత్ర ధరించి యుండును. శంఖ శబ్దము, శబ్దము-నాదము, సంగీతము, గాంధర్వము ఇత్యాది విద్యలకు అధిపతియని సూచించును. 'శం' అను శబ్దము శనిగ్రహ బీజము. 'ఖం' యను శబ్దము గురుగ్రహ బీజము. శనిగురుల తత్వము శ్రీగురు డనుగ్రహించును. శరీరమునకు, ఇంద్రియము లకు, మనస్సునకు శిక్షణము శని తత్త్వముగను, జీవునకు వికాసము గురుతత్త్వముగను శ్రీగురు డనుగ్రహించును. శని సంకోచ శక్తి (తమో ప్రభావము గలది). గురుడు వ్యాకోచశక్తి (సత్వ రజోస్వభావము కలది). తామసమునుండి ఉద్ధరించి, రాజసము నుండి పవిత్రీకరించి, గురువు జీవులను సత్వమున నిలుపును. నిత్య సత్త్వమున నిలచిన జీవుడు గుణాతీతుడగుట కువుడు అవకాశ మేర్పడును. జీవునకు శమము కలిగించి, వికాసమును శ్రీగురు డేర్పరచును.

## చక్రము

చక్రము కాలమును సంకేతించును. గ్రహములను, కాలమును కూడ నిర్జించి అనుగ్రహించు శక్తి గలవాడు శ్రీగురుడు. కాలము సృష్టి యందలి చతుర్వింశతి (24) తత్త్వములను తన యధీనమున నుంచును. కాలము రూపముననే, దైవము జీవులను సృష్టి యధీనమున నుంచును. కాలాతీతమగు దైవమే శ్రీగురు తత్త్వముగ సృష్టియం దుండుటచే కాలచక్రమును ధరించినట్లు సంకేతించును.

## గద

గద, మనలోని మదమును అణచు శక్తి. శ్రీగురుడు అతి చాతుర్యముతో, తనను స్మరించువారి మద మణచును. శ్రీగురుడు ప్రభువు వలె శిక్షించడు. శిక్షించక, శిక్షణము నిచ్చువాడు గురువు. అదియే చాతుర్యము. జీవుల మదమును, సత్వగుణ సంపత్తితో అతడు హరించును. జీవునకు సన్నివేశముల రూపమున, మదాది షడ్వర్గములను క్రమశః శ్రీగురుడు నిర్మూలనము చేయును. తత్ఫలితముగ మనలోని తల, మొండెమున వ్యాపించిన చైతన్యము గదవలె దర్శన మిచ్చును. వెన్నెముక యందలి చైతన్యము, శిరస్సు నందలి చైతన్యమును కలిపి దర్శించినచో, నిలబెట్టిన గద వలె మెరయుచు నుండును. ఇది యోగ దర్శనము.

## త్రిశూలము

శ్రీగురుని త్రిశూలము సంహార ప్రక్రియకు కాక యోగ ప్రక్రియకు వినియోగ పడును. జీవునిలోని బ్రహ్మాదండము, అందలి సుషుమ్న నాడి, దానికిరువైపుల గల ఇడ - పింగళ నాడులకు త్రిశూలము సంకేతము. అనగా, అది శ్రీగురుని

యోగదండమని అర్థము. ఇడ-పింగళ నాడులు మనలోని రెండు ప్రవాహములు. ఒకటి అవరోహణమునకు, రెండవది ఆరోహణము నకు వినియోగింపబడు ప్రవాహములు. సుషుమ్న వీటి సామ్యము. అవరోహణ ప్రవాహము అణువు లేర్పడుటకు, ఆరోహణ ప్రవాహము అని పరిణామము చెందుటకు వినియోగ పడుచుండును. జ్యోతిష చక్రమందలి ద్వాదశరాశులు కూడ, ఆరు నెలలు ఉత్తరాయణ పుణ్య కాలముగను, ఆరు నెలలు దక్షిణాయన కాలముగను తెలుపుదురు. ఇది నారాయణమను అవరోహణ, ఆరోహణా గమనములను సంకేతించును. సృష్టియందు కొన్ని అణువు లేర్పడుచుండగ, అదే కాలమున కొన్ని అణువులు లయమగు చుండగ, నడుమ అణువులున్నట్లు గోచరించును. నదీ జలములు పారుచూ పోవుచుండగ, అదే స్థానమునకు జలములు పారుచు వచ్చుచు పోవు చుండుటచే నది యున్నట్లు గోచరించును. సమస్త జలములు వచ్చిపోవును. సమస్త సృష్టియు వచ్చి పోవుచుండును. నది యున్నట్లే సృష్టి యున్నది. వచ్చిపోవు ప్రవాహముల నడుమ నది వున్నట్లుండును. రెండును ప్రవాహ గమనములే. ఒకటి అధోగమనము. మరియొకటి ఊర్ధ్వ గమనము. గమనమునకు బీజాక్షరము **'గం'** అను శబ్దము. ఇది రెండు రకములు గావున **'గంగ'** అయినది. గంగ యనగా ద్విముఖ ప్రవాహశక్తియని అర్థము. రెండు 'గ' శబ్దముల యందలి పూర్ణము సుషుమ్న! అది పరిపూర్ణ అస్థిత్వ స్థితి. అందున్నవాడు స్వస్థుడు. స్వ-అస్థి కలవాడు. అనగ తనయందు తానై యున్నవాడు. స్వస్థికమను యంత్రము గూడా స్వస్థిని కలిగించు ప్రభావము కలది. శ్రీగురుడు యోగమార్గమున స్వస్థతను చేకూర్చును. అనగ, జీవునకు తన నిజస్థితిని గోచరింప జేయును.

# కమండలము

శ్రీగురుని కమండలము ప్రాణశక్తి పూరకము. జీవులకు ప్రాణశక్తిని, తన గురు మంత్ర సంధానమున అందించువాడు. గురుడు, తా ననుగ్రహించు జీవునకు ఆయుర్దాయమును గూడ నీయును. ఆయుర్దాయము నిచ్చుట, ఆరోగ్యము నిచ్చుట, అటుపై ఈశ్వరత్వమును ప్రసాదించుట, అను మూడు ముఖ్యమగు ఆశీర్వచనములను శ్రీగురుడు సంకల్పించును. ఆయురారోగ్య ఐశ్వర్యమస్తు! అని దీవెన. ఇందు ఐశ్వర్య మనగ ఈశ్వరత్వమే. అంతకు మించిన ఐశ్వర్యము లేదు.

ప్రాణశక్తి శ్రీగురుని అధీనమున నుండును. దేహమున ప్రాణము స్థిరపరచి, యోగమును అభ్యసింపజేయుట శ్రీగురుడు నిర్వర్తించు ముఖ్యమైన కార్యములలో నొకటి. దేహమున ప్రాణమును స్థిరపరచి, యోగమును ఉపదేశించి, మనో వాక్కాయ కర్మలను శుద్ధి పరచి, సంఘసేవా కార్యక్రమములను నిర్వర్తింపజేసి, జీవుని సంచిత కర్మమును నిర్మూలింపజేయుచూ, కుండలినీ ప్రచోదన మొనర్చి, జీవునకు తన నిజస్థితిని బోధనల ద్వారా తెలియజేసి, అతనికి దివ్యశరీర మేర్పడుటకు సాధనా మార్గము నందించి, అంగుష్ఠమాత్ర పురుష దర్శనము చేయించి, అతడు శాశ్వతుడు, సనాతనుడు అని తెలియునట్లుజేసి, సృష్టి యజ్ఞమునకు తోడ్పడ జేయును. శ్రీగురుడు వివిధ గురురూపముల ద్వారా జీవుల నిట్లు అనుగ్రహించు చుండును. శ్రీగురుని చల్లనిచూపు ఎవరిపై బడునో, అతనికి సద్గురువు లభించును. అటుపై పన్నెండు జన్మలలో జీవుడు ముక్తుడు కాగలడు. దేహపోషణమునకు తల్లి ఎట్లు అప్రమత్తయై శిశువును పరిరక్షించునో, శ్రీగురుడట్లు జీవుని ప్రజ్ఞను రక్షించుకొనుచుండును.

# భిక్షా పాత్ర

శ్రీగురుని భిక్షాపాత్ర శంకరుని భిక్షాపాత్ర వంటిది. శ్రీగురుడు భిక్షమెత్తుట దేహపోషణమునకు కాదు. జీవ సంరక్షణమునకు. మనలోని మాలిన్యములను, దుష్కర్మలను సమస్తమును హరించుటకు శ్రీగురుడు భిక్షాటనము చేయును. మనమొసగిన ఆహారము ద్వారా మనయందలి సమస్త రుగ్మతలను తాను హరించును. గరళమును హరించి, సృష్టిని కాచిన దేవునకు జీవుల పాపములను హరించుట  పెద్ద విషయము కాదు. అతడు జీవులనట్లు కాపాడుటలో అతని విశ్వప్రేమ తత్వము తేటతెల్ల మగుచున్నది. తనను నమ్మినవారిని, తనను స్మరించిన వారిని, తన బోధనల ననుసరించు వారిని, తానందించిన సాధనా మార్గమున అభ్యాసము చేయువానిని శ్రీగురుడు అనుగ్రహించి, మృత్యువు, సంసారము అను అవస్థలనుండి సముద్ధరణము చేయును. ఇది సత్సాధకులకు విదితమే.

శ్రీగురునికి మననుండి వలసినది ఏమి? ఏమియూ వుండదు. నాయకునకు సేవకుడు యీయవలసిన దేముండును? సర్వమును తన యధీనమున నున్న దైవమునకు జీవుడేమి యీయగలడు? భిక్షాటనమున మనలను బంధించు, బాధించు విషయములను, భావములను తన పాత్రలో వేయుమను చుండును. మనలోని అసూయ, రాగద్వేషములు, కామ క్రోధములు, మద మాత్సర్యములు, అత్యాశ, అహంకారములు దానము చేయుమని భిక్షాపాత్రను చూపును. నిరహంకారియై, పై విషయములను ఆ పాత్రలోనికి విసర్జించినచో, కడిగిన ముత్యము

వలె జీవుడు సహజ ప్రకాశమును పొందును. శ్రీగురుడు కోరునది మన సుఖ-సంతోషములే ! మన జీవన వైభవమే ! మన మానందముగ సంసారమున తరించి జీవించు చుండగ చూసి ఆనందించును. అతని బిక్షాపాత్రలో వేయవలసినవి మనలను బంధించు, బాధించు, భయపెట్టు, పాడుచేయు భావనలని గుర్తుంచుకొనుడు. పాపహారుడు శ్రీగురుడు కావున, కృతజ్ఞతతో అతనియందు వర్తింపుడు. శ్రీగురుడు శాశ్వతానందమునకు మార్గము మరియు గమ్యము.

## ఏకత్వము

శ్రీగురు డెప్పుడునూ ఒంటరివానిగ నుండును. అనగ, అందరియందలి ఒకడాతడే! నిజమునకు తా నొకడే యిందరి రూపమున నున్నాడు. అతనికి ఒక ఊరని, ఒక పేరని ఏమియూ నుండదు. అతనికి నిజమునకు తలిదండ్రులు లేరు. కుల గోత్రములు లేవు. దేశీయాభిమానము లేదు. సిద్ధాంతము లేదు. సమస్తమునూ వ్యాపించిన ప్రజ్ఞ ఒక మతమునకు, కులమునకు, సిద్ధాంతమునకు కట్టుబడి యుండదు కదా! ఈ విషయమున శ్రీకృష్ణుని జీవితము పరిపూర్ణము. అతడునూ ఏ సిద్ధాంతమునకు, మతమునకు కట్టుబడక, సమస్తమును మన్నించిన వాడు. శ్రీగురునకు, శ్రీకృష్ణునకు అనంగీకార సన్నివేశము లేదు. సిద్ధాంతము లేదు. మతము లేదు. వారు కోరినది జీవ స్వాతంత్ర్యము. అది ధర్మముతో కూడియుండ వలె ననునది వారి శాసనము. ధర్మము, సత్యము- సిద్ధాంతములకు, మతములకు లోబడవు. సిద్ధాంతములు, మతములు- ధర్మమునకు, సత్యమునకు లోబడి

యుండవలెను. అట్లు కానిచో వానికి శాశ్వతత్వము లేదు. ఈ సందర్భమున వామనుడు బలి చక్రవర్తితో పలికిన పలుకులు వికాసవంతములు.

“ఇది నా నివాస మని ఏ రీతి పలుక గలను? ఒక చోట యనక అంతట నిండి యుందును. నే నెవ్వనికి చెందినవాడినని చెప్పవలెను? ఎవరి పిల్లవాడినని చెప్పుదును? నేను నాయంత వాడను. ఇది నా నడవడి యని ఎట్లు చెప్పగలను? మూడు రకముల నడవడులూ నావే. తామసము, రాజసము, సాత్వికము అయిన మూడు ప్రవర్తనలూ నా నుండి పుట్టినవే. ఏమి ఎరుగుదునని చెప్పుదును? అది నేర్తును, ఇది నేర్తును. (అది యనగ పరము, ఇది యనగ ఇహము. ఇహ-పరముల రెండింటిని నేర్తువని అర్థము.) అన్ని నేర్పులు నేనే! నాకు ఇతరులు లేరు. ఇతరులకు నేనున్నాను. నేను ఒంటరి వాడను. నాకు బంధువు లేడు. నే నందరికినీ బంధువును. నేను సజ్జనులయందు ప్రస్ఫుటముగ నుందును. అందరి యందును వుందును. నాకు తలి-దండ్రులు లేరు. పేరు లేదు. ఊరు లేదు. అన్ని పేర్లు, అన్ని ఊర్లూ నావియే!” ( శ్రీమద్భాగవతము - అష్టమ స్కంధము).

## సద్గురువు

‘సత్యాన్నాసి పరోధర్మః’ - సత్యమును మించిన ధర్మము లేదు. ఉన్నది సత్యము. అనగ అస్థిత్వము లేక, ఉన్నాను, అస్మి అని అనవచ్చును. జీవులు (Beings) అనుటలోని ఆంతర్యమిదియే. జీవులు వున్నవారు. వారినుండి, వివిధములుగ ప్రవర్తన లుద్భవించి లయ మగును. ఉండుట శాశ్వతము. జీవులు ఒకప్పుడుండి మరియొకప్పుడు లేకుండుట యుండదు. జీవుడు, శ్రీగురుని వలె

ఎప్పుడూ యుండును. తాను శాశ్వతుడనని, అమృతుడనని, నశించని వాడినని జీవు డెరుగడు. అది తెలియజెప్పుట, తదనుభూతిని కలుగజేయు మార్గము నందించుట సద్గురు వాచరించు ప్రథమ ధర్మము. ఈ మార్గము చూపని గురువు సద్గురువు కాదు. సద్గురువులు కాని గురువులు తమకు లోబడు మార్గములను అనుయాయులకు తెలిపెదరని, సత్యమునకు, ధర్మమునకు, ఆత్మానుభూతికి, జ్ఞానమునకు మార్గము తెలుపరని, అట్టి గురువులను విసర్జించ వలెనని భక్తాగ్రగణ్యుడు ప్రహ్లాదుడు తన సహాధ్యాయులకు తెలుపును. సర్వ వ్యాపకుడు, సృష్టికి కర్త, భర్త, ధర్త అయిన విష్ణు, వాసుదేవ, నారాయణ స్వరూపము తెలియరని, తెలుపరని, అమృతత్వ విద్య నేర్పరని, పుట్టని-చావని విద్య నేర్పరని, అట్లు నేర్పువారు మాత్రమే సద్గురువులని అతడు బోధించును.

బుద్ధిమంతులు ఈ విషయమును గ్రహించగలరు. సద్గురు సాన్నిధ్యము, ధర్మానుష్ఠానమునకు ప్రేరేపించవలెను. సత్యమునందు రుచి ఏర్పరచవలెను. స్వాధ్యాయమును, తపస్సును అభ్యసించు అభిలాషను ఏర్పరచవలెను. కేవలము తన చుట్టూ త్రిప్పుకొనుచుండువాడు, తనపేరు ప్రఖ్యాతులను చాటింపు చేయించుకొనువాడు గురువు కానేరడు. అట్టి గురువువద్ద చేరు శిష్యులు గూడ, వారి వారి పనులను చేయించుకొనుటకు చేరుదురు. భజనపరులై గురువును వినియోగించు కొందురు. ఇది కలి ప్రభావము. ఈ పరమోత్కృష్టమైన గురు-శిష్య సాంప్రదాయమునుకూడ కలి భ్రష్టు పట్టించగలడు. కేవలము ఆహారాసక్తి, మైధునమం దాసక్తి కలవారు పరిపూర్ణముగ కలిచే మోసగింప బడినవారు. అట్టివారు గురు రూపమున గూడ

నుండుట కలి ఇంద్రజాలము. మంద్రజాలము మాత్రమే దీనికి పరిష్కారము. మంద్ర మనగా జీవ చైతన్యము. జీవులను చైతన్యవంతులుగ తీర్చిదిద్ది, ఇంద్రియముల నుండి ఉద్ధరించు మిత్రుడే సద్గురువు. అట్టి సద్గురువు, తపస్సు, స్వాధ్యాయము, సంఘసేవ, సహజీవనము, స్వధర్మాచరణము, శిక్షణముగ శిష్యుల కందించును.

గురు-శిష్య సాంప్రదాయమును గూర్చి నికోలా రోరిక్ అను రష్యన్ యోగి ఇట్లు పలికెను. ‘‘భారతదేశమే ఈ భూగోళమునకు వెలుగు చూపించగల దేశము. కారణమేమన, ఈ దేశమున మాత్రమే గురుశిష్య సాంప్రదాయము పటిష్ఠముగ నున్నది. ఆత్మ విద్యకు గురు సాన్నిధ్యము ఎంతయో ముఖ్యము. అట్టి సద్గురువులు ఈ దేశమున ఎందరో కలరు. భారతదేశమున ఒక పిల్లవానిని పిలచి, నీవు సూర్యుని పొంద దలచితివా? యని అడిగినచో అతని కన్నులయందు మెరపు మెరయును. ముఖము కాంతివంత మగును. అతనిని, నీవొక సద్గురువును పొంద దలచితివా? యని ప్రశ్నించినచో ముఖము మిక్కుటముగ కాంతివంతమై కన్నులు మిరుమిట్లు గొల్పును. నీకు సద్గురువన్న ఎందుకంత ప్రీతి? యని ప్రశ్నించినచో అతడిట్లు పలుకును. సూర్యుడు కాంతిని, బుద్ధిని, ప్రాణమును ఇచ్చును. సద్గురువు పన్నెండు సూర్యుల పెట్టు. సూర్యునికి అందివచ్చు కాంతి, వెలుగు, ప్రాణము సద్గురువు నాకు సరాసరిగయే నీయగలడు. అందువలన నాకు సద్గురువే సమస్తము’’ అని తెలుపును.

నికోలా రోరిక్ రష్యాదేశపు రాజవంశమునకు చెందినవాడు. హిమాలయములపై మక్కువగొని తన జీవితమంతయూ

హిమాలయ శిఖరముపైనను, లోయలలోను గడిపెను. అతడొక తపస్వి! అతని తపనకు సంతసించి దివ్య దేహధారులైన హిమాలయ గురుపరంపరలోని సభ్యులు దర్శన మిచ్చిరి. స్పర్శన మిచ్చిరి. సంభాషణ మెనర్చిరి. వారి పవిత్ర మరియు రహస్య ఆశ్రమము లలోనికి ప్రవేశము నిచ్చిరి. అతడు స్ఫూర్తివంతుడై అగ్నియోగ మార్గమును బోధించెను. గురుపరంపరాగతమైన ప్రాచీన జ్ఞానమును తన సహధర్మచారిణి ద్వారా ప్రపంచమున కందించెను.

“ఓ భారతదేశమా! నీవు ధన్యవు. మానవజాతి తరించుట కొరకై యుగయుగముల జ్ఞానమును భద్రపరచి యున్నావు. నీవే భౌగోళికముగ మానవజాతికి మరల జ్ఞాన బోధనుచేసి తరింప జేయగలవు.” అని, భారతీయ గురు-శిష్య సాంప్రదాయమును కొనియాడినాడు.

## శ్రీగురు యంత్రము (సంకేతము)

ఋషిప్రోక్త మార్గములో యంత్ర రూపముగ దైవము నారాధించుట ప్రధానము. యంత్రము, మంత్రము, తంత్రము అను త్రయీవిధ ధ్యానమున, దైవప్రజ్ఞ సులభముగ అనుభూత మగును. పంచాక్షరీ జపమునకు పంచారము, అష్టాక్షరీ జపమునకు అష్టదళ పద్మము, ద్వాదశాక్షరికి ద్వాదశారము (Dodela Hedron) శ్రీదేవి ప్రార్థనకు శ్రీచక్రమేరు, ఈ విధముగ యంత్ర వినియోగము రకరకములుగ కలదు. ప్రతి మంత్రమునకు దానిదైన, విశిష్టమైన సంఖ్యాబలము, యంత్రబలము కలదు. ఒక యంత్ర మాధారముగ, ఒక మంత్రమును, విధివిధానముగ (ఋషిప్రోక్త మార్గమున) పూజించి, ఆరాధించి, ధ్యానించి, అనుభూతి చెందుటయే తంత్రము.

దత్తాత్రేయ తంత్రమునకు ఈయబడిన యంత్రము వైదిక మార్గమున యీ క్రింది విధముగ నున్నది.



కేంద్రము, పరిధి శుద్ధ చైతన్యముకు సంకేతము. త్రిభుజము త్రిమూర్తులకు, త్రిశక్తులకు త్రిగుణములకు, త్రికాలములకు, త్రిలోకములకు సంకేతము. ఈ యంత్రమును 'శ్రీగురు యంత్ర' మందురు.



*ఒక బిందువు*
*రెండు బిందువులు*
*మూడు బిందువులు*
*నాలుగు బిందువులు*

త్రిభుజాకారముగ పేర్చబడిన పది బిందువులు దశాంగుళ మను యంత్రము. ఇందలి మూలలు త్రయీమయములు. లోపలి ఏడు బిందువులు ఏడు లోకములు. కేంద్ర బిందువు చుట్టునుగల ఆరు బిందువులు షట్చక్రములు. ఏడవది జీవప్రజ్ఞ అనికూడ భావము. షణ్ముఖమైన చక్రమునకు కేంద్రబిందువుగ, మరియు యంత్రమునకు కేంద్ర బిందువుగ జీవుని ఊహింప దగును. తన చుట్టును షణ్ముఖ చక్రము, దాని నధిష్ఠించి త్రిమూర్తులు. మొత్తము దశాంగుళము. దీనినే గ్రీకు ఋషి యగు పైథాగరస్ డికాడ్ (DECAD) అని సంకేతించెను. యూదులు ఈ దశకమునే పది అంకెలు గల పరిపూర్ణ వృక్షము, కల్ప వృక్షము అని కీర్తింతురు. సెఫారెల్ ట్రీ అని ఆంగ్లమునను, సెఫారా యని యూదు భాషయందును అందురు.




దీనినే మండలమని ఋగ్వేదము కీర్తించినది.

ఈ దశకము ననుసరించియే కాల విభాగము పది పదిగ గూడ నున్నది.

| | | | |
|---|---|---|---|
| కలియుగము | 1 | 432000 | సంవత్సరములు |
| ద్వాపరయుగము | 2 | 864000 | సంవత్సరములు |
| త్రేతాయుగము | 3 | 1296000 | సంవత్సరములు |
| కృతయుగము | 4 | 1728000 | సంవత్సరములు |
| మహాయుగము | 10 | 4320000 | సంవత్సరములు |

| | |
|---|---|
| 1000 మహాయుగములు-8 సంధులు | ఒక బ్రహ్మపగలు |
| సరిసమాన కాలము | ఒక బ్రహ్మ రాత్రి |
| 100 బ్రహ్మ సంవత్సరములు | ఒక బ్రహ్మ ఆయుష్షు |

ఈ పది అంకె ఆధారముగనే దశ అవతారములు తెలుపబడినవి. ఒక మహాయుగమున దశావతారములు వచ్చి పోవుచుండును.

దశక విజ్ఞానము మహత్తరమైన జ్ఞానము. కేవలము పై యంత్ర ధ్యానమున సమస్త సృష్టి రహస్యములు అవగతము కాగలవు. సృష్టియందలి సమస్త విజ్ఞానమునకు ఈ యంత్రము సింహద్వారము వంటిది.

మొదట జ్యోతిశ్చక్రమున గూడా పది రాశులే యుండెడివి. దానిని నేటికి గూడ పరిపూర్ణ రాశిచక్ర మందురు. పన్నెండు రాశుల

రాశిచక్రము కామ ప్రధానము. పది రాశుల చక్రమందు మేషము, వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము యుండును. తులా రాశి, కన్యారాశి ఉత్తరపక్షము, వృశ్చికరాశి పూర్వపక్షము యుండవు. మొత్తము ఆరు రోజులుండవు. ఈ కాలము, జ్యోతిషమున కామ ప్రధాన కాలముగ తెలుపుదురు.

కామ కారణముగనే, చాక్షుష మన్వంతర మంతరించినది. చాక్షుష మన్వంతరమున మానవులకు మూడవ కన్ను పనిచేయు చుండెడిది. మానవుడు కాముకుడగుచు, అంతకంతకు స్థూలమై ఘనీభవించుట కామము మూలమున జరిగినది. స్థూల శరీరము బాగ ఏర్పడుటచే మూడవకన్ను మూసుకొనినది. అది ప్రస్తుతము పీనియల్ గ్రంథిగ, నిరుపయోగముగ నున్నది. చిన్నతనమున, ఏడు సంవత్సరముల వరకు ఈ గ్రంథి చైతన్యవంతముగ నుండునని, దేహము ఘనీభవించు చుండగ, అది క్రమశః మూయబడునని పెద్దలు తెలుపుదురు. ప్రస్తుత వైద్యశాస్త్రమున, మణిపూరక గ్రంథి, విశుద్ధి, స్వాధిష్ఠాన గ్రంథులే పరిగణింపబడు చున్నవి. హృదయగ్రంథి, ఆజ్ఞాగ్రంధి పనికిరావని, అవసరమైనచో థైమసు (THYMUS)నిర్మూలించ వచ్చునని వైద్య నిపుణు లందురు. నిజమునకు, యోగికాని వానికి ఈ గ్రంథులు పనిచేయవు. కారణము, అర్థ కామములు ప్రాధాన్యత నొందుటయే. ధర్మము నాచరించని అర్థ కామములు అనర్థములు. అట్టివారిని అజ్ఞాన మావరించును. కన్యారాశి ఉత్తర భాగము, తులారాశి, వృశ్చికరాశి పూర్వభాగము కామోద్రేకములు కలిగించగలవు. వాని వలన మనిషి పతనము చెందగలడు. అందులకే కన్యారాశి ఉత్తర పక్షము పితృదేవతల పూజలు, తులారాశిలో అమ్మవారి పూజలు,

వృశ్చికరాశిలో శివపూజలు నిర్దేశించి, కాలప్రభావమునకు లోను గాకుండుటకు ఋషుల ప్రయత్నము.

పై యంత్రయునే సరళముగ, ప్రాథమికముగ ఈ క్రింది విధముగ ఋషులు అందించిరి.



గుప్తవిద్య కర్మాలైనవారికి మొదట ఈ యంత్ర ధ్యానము విధి విధానముగ అందించబడును. హెచ్. పి. బ్లావెట్స్కీ అను ఉపాసికకు మరువు మహర్షి (భాగవతమున తెలుపబడిన సూర్య వంశీయుడగు అతి ప్రాచీన మహర్షి) పై యంత్రమును, ధ్యాన విధానమును అందించినాడు. ఆమె యంత్రధ్యానమున సిద్ధి పొంది, సప్తస సృష్టి రహస్యములను, మన్వంతర రహస్యములను, మానవుని నిర్మాణము, భూమిపై అతని చరిత్ర మానవాళికి అందించి, పాశ్చాత్య దేశములలో జ్ఞానమాతగ ప్రసిద్ధి గాంచినది.

దశాంగుళ యంత్రము నాలుగు స్థితులలో పది అంశములను వివరించుచున్నది. నాలుగు యుగములలో దశ అవతారము లుండుట భారతీయు లెరిగిన విషయము. ఇందు నాలుగు బిందువులు ఒక సరళ రేఖగను, మూడు బిందువులు మరియొక సరళ రేఖగను, రెండు బిందువులు మరియొక సరళ రేఖగను, ఒక బిందువు మాత్రమే ఒక సరళ రేఖగను గన్పట్టును.



1. *కలియుగము*
2. *ద్వాపరయుగము*
3. *త్రేతాయుగము*
4. *కృతయుగము*

నాలుగు బిందువులు కృతయుగము - సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ.
మూడు బిందువులు త్రేతాయుగము - ధర్మము, శాంతి, ప్రేమ.
రెండు బిందువులు ద్వాపరయుగము - శాంతి, ప్రేమ.
ఒక బిందువు కలియుగము - ప్రేమ.

యుగ ప్రభావ మెట్లుండును అను విషయమున పై వివరణము స్పష్టము. శ్రీగురుడు ప్రేమతత్త్వమే ఆధారముగ జీవులకు ధర్మమును తానే బోధల ద్వారా నేర్పుకొనును. సత్యము ననుసరింప జేయును. సత్యము, ధర్మము, ప్రేమ మార్గమున శాంతిని జీవుల హృదయములలో నెలకొల్పును. అట్టి వారిపై యుగ ప్రభావము, కాల ప్రభావము యుండదు. త్రిమూర్తులు శ్రీదత్తుని త్రయీ విధమగు అంశలు కాగా, సప్తలోకములు అతని శరీరమని అర్థము. మూడు అంశలనుండి ప్రజాపతులు, ఆదిత్యులు, రుద్రులు, వసువులు ఏర్పడగా, వారినుండి మనువులు, పితరులు, కిన్నెరులు, కింపురుషులు, యక్షులు, గంధర్వులు ఉద్భవించిరి. ఈ మొత్తమంతయూ శ్రీదత్తుని శరీరమే. అందువలన సృష్టిలో ఏ రూపమున నైననూ శ్రీదత్తుడు దర్శన మీయగలడు. అందుచేత అతడు ఉన్మత్త వేషధారి యని కూడ పిలువబడు చున్నాడు.

శ్రీగురుని ధ్యానించు యంత్రము రూపము ముందు వివరింప బడినవి. మూడు తలలు గలిగి, ఆరు చేతులు కలిగి, హస్తముల యందు శంఖము, చక్రము, గద, శూలము, కమండలము, బిక్షాపాత్ర ధరించి గో, శారమేయ సమేతుడై యున్న మూర్తిని ధ్యానించుట కలియుగ సాంప్రదాయము. తమతమ సద్గురు మూర్తులను కూడ శ్రీదత్తుని రూపముగ ధ్యానించుట గూడ మరియొక సాంప్రదాయము. ఈ రూపము

లన్నింటి యందును శ్రీదత్తుడు తన సాన్నిధ్యమును మిక్కుటముగ నీయగలడు. గురుస్థానము లన్నియు దత్త స్థానములే. నారాయణుని నుండి లేదా దక్షిణామూర్తి నుండి తమతమ ఆచార్యుల వరకు గల సమస్త గురు పరంపర శ్రీదత్తుడే. ఈ విషయమును ఈ క్రింది శ్లోకములు విశద పరచుచున్నవి.

*నారాయణ సమారంభాం శ్రీ శంకరాచార్య మధ్యమాం ।*
*అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం ॥*

*లేదా*

*సదాశివ సమారంభాం శ్రీ శంకరాచార్య మధ్యమాం ।*
*అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరంపరాం ॥*

తమతమ గురువులనుండి పరబ్రహ్మము వరకు గల పరంపరను ఋషు లీ క్రింది విధముగ స్తుతించుచున్నారు.

**గురుభ్యో నమః**
**పరమ గురుభ్యో నమః (గురువునకు గురువు)**
**పరమేష్ఠి గురుభ్యో నమః (పరమ గురువునకు గురువు)**
**సప్తఋషిభ్యో నమః**
**ధ్రువాయ నమః**
**సనకాయ నమః**
**సనందనాయ నమః**
**సనత్కుమారాయ నమః**
**శుకాయ నమః**
**వ్యాసాయ నమః**
**నారదాయ నమః**
**పరబ్రహ్మణే నమః**

పరతత్త్వము నుండి, తమ గురువు వరకు వ్యాపించి యున్న సమస్త పరంపర శ్రీగురుని రూపమే!

## గురుమంత్రము - తారక విద్య

శ్రీదత్తుని ధ్యానించు బీజాక్షరము 'ద్రాం'. ద శబ్దము ఇహపర సౌఖ్యముల నిచ్చునది. కామదం మరియు మోక్షదం. ర- శబ్దము అగ్నిబీజము. నశింపజేయవలసిన అజ్ఞాన మాలిన్యమును నశింపజేసి, నశింపని తేజస్సును జీవునియందు ఆవిష్కరించును. "ఓం, ద్రాం అని పదిమార్లు ఉచ్చరించుట నుండి, శ్వాసయందు (అనగ ఉఛ్వాస నిశ్వాసల యందు) ప్రతిష్ఠ చేయుట వరకు మంత్రజపము సాగవలెను. శ్వాస ననుసరించిన మంత్రము క్రమశః స్పందనమును చేరి హృదయప్రజ్ఞను ఆవిష్కరించ గలదు. హృదయ స్పందనమును చేరిన ద్వయాక్షరీ మంత్రము సూక్ష్మ స్పందనము చేరి జీవునకు క్రమశః నిజ స్వరూపమును ఆవిష్కరింపజేయును. హృదయమ్ అనగా హృత్ + అయమ్ అనగ నే నిక్కడున్నాను అని భావము. సూక్ష్మ స్పందనము హంసవలె కదలిక కలిగి ఊర్ధ్వగతి చెంది భ్రూ మధ్యమును జేరును. జీవునకు తానే హంస స్వరూపుడుగను, మంత్రస్వరూపుడుగను తెలియగలదు. అటుపై సాధన సాగగ భ్రూమధ్యమునుండి జీవుడు అంగుష్ఠ మాత్ర తేజోరూపుడై పాంచభౌతిక దేహము నుండి యీవలకు వచ్చును. అదియే రామాయణమున 'లంక' నుండి యీవలకు వచ్చుట (తరించుట)గా తెలిపిరి. విభీషణు డట్టివాడు. లంకలో ప్రవేశించుట, యీవలకు వచ్చుటకూడా తెలిసిన జ్ఞానయోగి హనుమంతుడు. లంకనుండి కొనిరాబడినది సీత. లంకలో నశించినది రావణ కుంభకర్ణాదులు.

లంకయే శరీరము. అందు మరణించువారు నిజస్థితి తెలియని అజ్ఞానులు. అందుండి తరించినవారు ముక్త సంగులు. తరింపజేసిన ఆంజనేయులు సద్గురు స్వరూపులు. రామాయణము జీవుని ఆత్మకథయే! రామాయణము అనగా రమ చరిత్రము, సీతా చరితము. అందలి సుందరకాండము సద్గురు ప్రవేశ ప్రధానము. లంకా ప్రవేశము సద్గురుడు చేయుటయే సుందరము, శుభప్రదము. శరీరమున గురుప్రజ్ఞ ప్రవేశించిన, జరుగు రసాయనము తేజస్సును ఆవిష్కరించును. అసురులను (అజ్ఞానమను చీకటి కేంద్రములను) నశింపజేయును. జీవునకు ధైర్యము, స్థైర్యము, తరణము కలుగజేయును.

## మహా వాక్యము

జీవితమున శ్రీగురుని ప్రవేశము సర్వ శుభప్రదము. అంతకు మించిన అదృష్టము ముమ్మాటికినీ లేదు. మానవజన్మ లభించుట మొదటి అదృష్టమని, ఆస్తిక్యబుద్ధి కలిగి యుండుట రెండవ అదృష్టమని, సద్గురు సాన్నిధ్యము లభించుట మూడవది, అత్యుత్కృష్టమని శ్రీశంకర భగవత్పాదులు కీర్తించినారు. సద్గురువు అందించిన మంత్ర మేదైననూ అది మహామంత్రమే. అది మహా వాక్యమే. దానిని సద్బుద్ధితో, శ్రద్ధాభక్తులతో, పూర్ణ విశ్వాసముతో జపించిన (గురువు చెప్పిన రీతిలో) పుష్కర కాలమునకు సద్గురువు అనుగ్రహించును. ఇదియొక శాశ్వత సత్యము. సద్గురు విచ్చినదే మంత్రముగాని, తాను మంత్రము నెన్నుకొనరాదు. కోరి అందుకున్న మంత్రముకన్న, కోరక, సద్గురు కృపగ లభించిన మంత్రము మిన్న. సద్గురుని సేవించుచుండిన, అతని హృదయమున కలిగిన ప్రేమ, దయ, కరుణ కారణముగ అతడే మంత్రము నీయును.

వేధించి, సాధించి అందుకొనినది మంత్రమే అయినను మహిమాన్వితము గాదు. అందించిన మంత్రమును అతి రహస్యముగ, ఒంటరిగ, డంబాచారము లేక దీక్షతో నిర్వర్తించు కొనవలెను. మంత్రము సిద్ధించుటకు, మంత్ర విషయమున, మననము, మౌనము, పవిత్రత ముఖ్యము. అపరిగ్రహమను గుణముగూడ జోడించినచో త్వరితముగ సిద్ధి కలుగును. జీవుని లక్షణమును, సంస్కారమును అనుసరించి సద్గురువు మంత్రోప దేశము చేయును.

సద్గురువు కృపా కటాక్షము, సాన్నిధ్యము కలుగవలె నన్నచో, అతడొసగిన మంత్రజపము జరుగవలెను. ఉపదేశ మేది యైననూ, దీక్షతో నిర్వర్తించుకొనవలెను. తెలిపిన నియమములను తు.చ. తప్పక ఆచరింపవలెను. అతడు నిర్దేశించిన సత్కార్యములను గూడ సమర్పణ బుద్ధితో నిర్వర్తించవలెను. అతని బోధనలను నిత్యము పఠించి, ఆచరణయం దుంచుటకు త్రికరణ శుద్ధిగ ప్రయత్నించవలెను. ఈ మూడు నియమములు శిష్యునికి ఉద్ధారకములు. త్రివిధములుగ స్పర్శను పొందుచుండవలెను.



# శ్రీగురుస్థానములు

సాలగ్రామము నందు, ఔదంబర వృక్షమునందు, గోవునందు, శరమము (కుక్క) నందు, సత్పురుషుని యందు శ్రీగురుని సాన్నిధ్యము స్మరణమాత్రమున లభించును. గురువారము నందు, మార్గశీర్ష మాసమునందు, మాస శివరాత్రి, పౌర్ణిమలందు, శ్రీగురుని సాన్నిధ్యము సులభతరము. ఏకాదశీ వ్రతము నాచరించుటచే శ్రీగురుడు మిక్కిలి ప్రీతిచెందునని భాగవత మార్గము తెలుపుచున్నది. అందుచే ఏకాదశి తిథులు పవిత్రములు. నదీ సంగమ ప్రదేశములయందు మిక్కుటముగ శ్రీగురు సాన్నిధ్యము లభింప గలదు. శివ క్షేత్రములయందు, విష్ణు క్షేత్రములయందు ఉన్మత్త వేషమున శ్రీగురు దర్శనము సాధ్యము. విభూతి యందు, చందనమునందు గూడ, గురుతత్వ మధికము. కావున వానిని ధరించుట శ్రేష్ఠము. పర్వత శ్రేణులయందు, పుణ్యక్షేత్రముల యందు, పుణ్యతీర్థముల యందు, ఏకాంతమున శ్రీగురు దర్శనమున కవకాశము కలదు. సత్పురుషులను గౌరవించి పూజించుట వలన కూడ శ్రీగురుదత్తుని అనుగ్రహమునకు పాత్రులు కాగలరు.

జగద్గురువు, దివ్య దేహధారి, జ్ఞానస్వరూపుడు, మాయా - మోహములనుండి తరింప జేయువాడు, నిర్మలుడు, ప్రశాంతుడు, పుణ్యమూర్తి, పూర్ణానంద స్వరూపుడు, బుద్ధి ప్రచోదనము చేయువాడు, సిద్ధి నిచ్చువాడు, యోగేశ్వరుడు, కరుణాసింధువు, జగద్బంధువు, ప్రేమ స్వరూపుడు నగు శ్రీగురు దత్తాత్రేయుడు పాఠకుల ననుగ్రహించి, యోగమున ప్రవేశము నిచ్చుగాక!

శుభమ్